పుస్తకము పేరు హనుమద్విజయము

రచయిత : గంగారాజేశ్వరరావు

హక్కులు : సర్వం గ్రంథకర్త పరమైనవి

ప్రథమ ముద్రణ : విక్రమ వైశాఖ శుద్ధపౌర్ణిమ
18-05-2000

ప్రతులు : 1000

మూల్యము : రూ: 30/-

ప్రతులకు : 1 గంగారాజేశ్వరరావు,
ఇం.నెం.7-20, మంథని-505 1
కరీంనగర్ జిల్లా.

2. గంగా తరంగిణి సారస్వత సమితి
మంథని - 505 184,
కరీంనగర్ జిల్లా

ముఖచిత్రం : రేగళ్ళ చంద్రశేఖర శర్మ
మంథని - 505 184

ప్రచురణ : గంగా తరంగిణీసారస్వత సమితి,
మంథని - 505 184.

ముద్రణ : శ్రీలక్ష్మి ప్రింటింగ్ ప్రెస్,
గాంధీచౌక్, మంథని - 505 184,
కరీంనగర్ జిల్లా. ✆ 59490



# గంగా రామాయణము

## హనుమద్విజయము
## రగడ కావ్యము

కృతికర్త
కవిశేఖర

**గంగా రాజేశ్వరరావు**, M A B Ed



"THIS BOOK IS PUBLISHED WITH THE FINANCIAL ASSISTANCE OF TIRUMALA TIRUPATI DEVASTHANAMS UNDER THAIR SCHEME AID TO PUBLISH RELIGIOUS BOOKS"

ప్రచురణ
గంగా తరంగిణీ సారస్వత సమితి
మంథని

# హనుమద్విజయము

## విషయ సూచిక

## తృతీయాశ్వాసము

ముద్రికాప్రదానము



## చతుర్థాశ్వాసము లంకాదహనము

## హిమాలయస్థిత చిరంజీవి



ఆపదా మపహర్తారం
దాతారం సర్వ సంపదాం
లోకాభి రామం శ్రీరామం
భూయో భూయో నమామ్యహం

అంజనానందనం వీరం
జానకీ శోకనాశనం
కపీశ మక్షహంతారం
వందే లంకాభయంకరం



దివంగత గంగా కృష్ణ - గ్రంధకర్తపౌత్రుడు
అమృతా కీ శే గంగారాజలక్ష్మణరావుల
చిన్న కుమారుడు
జననము 1972
మరణము 1977

## సంతాపము

నాన్నా! నాన్నా! యనచును
నాన్నను నిల్పితివి! నీదు-నాలుక యం దా
నాన్నను దుఃఖజలధి నిడి
నాన్నా! చనినావు పిన్న-నాడే యకటా!

చిన్నతనమునం దాడుచు,
తిన్నగ నొకటినుప తలుపు - తీరా పడగా
జిన్నారి చేతు లానిచి
కన్నయ్యా! దాని నాప-గలిగితి వయయో!

చెన్నుడ! ముద్దుల కృష్ణా!
ఎన్నని నీ పెద్ద బుద్ధు-లెన్నుదు? "నిండా
యున్నవి నా గుమ్ములు చి
న్ననల వవి నిండుకొన్న"వని చూపితివే!

అన్నం బన్నం బని తిను
చున్న ప్రియుల పొత్తులందు - తింటివి కట్టా!
అన్నం బొడిసెను నీకిట
పున్నుడ వేసితివి గంతు - పోయితి వెటకో!

అన్నా! నేనుండ ననుచు
నన్నావా? పాడు లోక-మం దెనడేనిన్
అన్నెము పున్నెము లెరుగని
నిన్నుం టయిషైడు గొనెను-నెనరు! విడుచుచున్

కన్నీరు కాల్వగా, నా
కన్నయ్యా! యంచు తల్లి - క్రందించగ, రా
నన్నా మృత్యువు విడవక
వెన్నుడ! గొని పోయెను తన - వెంటన్ నిను హా!

శ్రీ గీట్ల జనార్దన రెడ్డి
M A B Ed , L L B ,
పూర్వశాసన మండలి సభ్యులు

హార్దికాభివందనములు!

కవిశేఖర, కళానీరాజన పురస్కార గ్రహీత మరియు గంగా తరంగిణీ సారస్వత సమితి వ్యవస్థాపకులు, గురుదేవులు, బ్రహ్మశ్రీ గంగారాజేశ్వరరావు గారు ప్రాచీన పద్య కవితా ప్రక్రియలో నందెవేసిన చేయిగా ప్రసిద్ధులు

వారు వయోవృద్ధులే కాక జ్ఞానవృద్ధులు, పలు పద్య రచనా విద్యా విధానములో సిద్ధహస్తులు, ప్రసిద్ధులు అనేక గ్రంథాలని వ్రాసి ప్రచురించిన వీరు తొంబది యేండ్ల వయస్సులోను "హనుమద్విజయ" మను రగడ కావ్య రచనా భారము ను విజయవంతముగా ముగించుట సాహసమే కాక స్వాగతార్హము, సంస్తుత్యము.

గత గర్భము నుండి వెలువడిన రామాయణము లెన్నియో సుందరకాండమును బహు రమ్యముగా పాఠకుల కందించినవి కీ శే.ఎమ్ ఎస్ రామారావు గారు పాడుకొనుట కనువైన, సులభగ్రాహ్యమైన "సుందర కాండ" రచించి, తానే గానము చేసి ప్రచారము లోనికి తీసికొని వచ్చిన యంశమును సామాన్యశ్రోతలు సంగీతజ్ఞులు మరువ లేరు సంస్కృతములోని వాల్మీకి రామాయణము నుండి భాస్కర, రంగనాథ, మొల్ల రామాయణాదులు ప్రసిద్ధ కావ్యములు

ఇప్పుడు మన గురువు గారు కేవలము రకరకముల రగడలతో రామాయణ కావ్యాంశమును సుందర కాండ సమగ్ర రూపముగ నొకచో నీ పుస్తకము నందించినారు సంక్లిష్ట ఛందోరీతులు గల రగడలు వ్రాయుట కష్టమనిపించినను కొన్ని రీతులు ఉదా: ప్రవాళహారిణగతి వంటి రగడలు సులభముగాను, సుగ్రాహ్యముగనే గాక సుస్వర, సస్వర గానము కనువై యుండి పాఠకులను, శ్రోతలను సంగీత భంగీతరంగి తాంతరంగంబు లైన వన కురంగంబుల జేసి, హిమవన్నగ శృంగంబుల నెక్కించి, గంగా తరంగములలో నోలలాడించి మెప్పించుననుట అత్యుక్తులు కావు

అన్వయ కాఠిన్యమునకు పాఠకులు బెదరు పరిస్థితు లటనట నున్నను ఆనందింప జేయు రగడల రంగవల్లులే మిక్కిలి చక్కగా శృంగారించిన గంగా రాజేశ్వరులు వాగీశ్వరీ స్వరూపులు కథాంశము క్రొత్త కాకున్నను కవితారీతి నూతనము, విషయము పాతదైనను వివరించిన విధానము విశేషమైనది

కావ్యమును `ఓంశ్రీగణేశాయనమః తరువాత మధురగతి రగడలో నుపక్రమించినారు మంచీ చెడునుక్షీర నీర న్యాయములో వేరు చేయు సంకేత మిందున్న ప్రతిబింబము

గంగా రామాయణ సుమహారమున గణేశ, సరస్వతి రామచంద్ర, హనుమ శ్శిష్ట చతుష్టయము ముఖ్యులైన సంసేవితులు మధురగతి, హరిగతి, హయప్రచార, తురగవల్గన, విజయ మంగళ, ద్విరదగతి, విజయభద్ర, హరిణగతి, వృషభగతి, ప్రవాళ, మరాళాది రగడలు, కంద, సీస, ఉత్సాహమత్త కోకిల, మంగళ మహాశ్రీ గర్భరగడలు-మరియు కావ్యాంతమున అనుబంధ బంధములు ఉదా శార్దూల విక్రీడిత చతుష్పథ, కంద శ్రీకార, ప్రవాళ శ్రేణి, మధురగతి నక్షత్ర, హరిణగతి చక్ర, మధురగతి కూర్మ, కలిసంతరణ ఉర్వారుక మంత్రత్రయ విహంగ శ్రీరామమంత్రవ్యజన, రక్షామంత్ర చతుష్పాళి బంధములు చూపించినారు

ఇందలి యాశ్వాసములు, పరిచ్ఛేదములు, వర్ణనలు ప్రౌఢమైన ప్రాచీన రీతులు, కాని డా॥ సి నారాయణ రెడ్డి గారు రచించిన మాత్రా ఛందస్సు, నాగార్జున సాగరము కర్పూర వసంతరాయలు జ్ఞాపకము వచ్చు నాధునిక రీతులును మన కటనట కనిపించిక్రొత్త దనమును స్ఫురింప జేయుచున్నవి

ఉదా అతనికి ప్రాంతపుటెల్లలు
అక్షిగోచరములు కావు! అని

నాగార్జునసాగరములో (ప్రవాళగతి రగడ విధానము)

వారి ఉత్సాహమును చెప్పగ-వాయి చాలదు వాక్కు-చాలదు (హరిణగతి విధానము) అని 'కర్పూర వసంతరాయలు' గేయ కావ్యములో గల చరణములను పోల్చుకొని గాలి పీల్చుకొన వచ్చును

ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున నున్న అనేక కవితా రీతులలో శ్రీగంగారాజేశ్వర కవివర్యులెన్ను కొన్న ఫక్కి-, ప్రక్రియలు శాశ్వతత్వము కల ప్రాచీన రీతులు అంధందాధునికత్వము తొంగిచూచి మనకాహ్లాదమును మనకన్న పిన్నల కానందమును చేకూర్చుచున్నయవి

నారికేళములను నాటి పాషాణాల
కడకు బెట్టి ద్రాక్ష, కదళి మించు
వారి తరము వారి వరియన్న మెంతేని
సులభముగనె యరిగి బలము నిచ్చు

అందుచేత పెద్దలు, అస్మద్గురు వర్యులు, బ్రహ్మశ్రీ గంగారాజేశ్వరరావు గారికి నా యభివాదములు వారు మరింత సాహితీ సేవ చేయవలెననునది మదీప్సితము

విశ్వాసముతో విధేయుడు

**శ్రీ గీట్ల జనార్ధన రెడ్డి**

MALLB,

అడ్వకేటు

ఓం

# సుందరకాండ రగడ కావ్యం

రచయిత

## గంగారాజేశ్వర రావు గారు

శ్రీ గంగా రాజేశ్వరరావు గారు వ్రాసిన సుందర కాండ రగడ కావ్యము, వాల్మీకి రామాయణంలోని మూలమునకు రమారమి శుద్ధానువాదమే కాక కొన్ని చోట్ల విషయ ప్రాశస్త్యమునకై స్వతంత్ర విశ్లేష కలది ఇందలి కవితా వైశిష్ట్యములో అంత్య ప్రాస కష్టసాధ్యమై నూతన శోభ కలిగించినది కందగర్భ, మత్తకోకిలగర్భ ఉత్సాహవృత్త గర్భ, మంగళమహాశ్రీగర్భ రాజేశ్వరరావు గారి కవితా వైదుష్యమునకు తార్కాణములు

రావణుని నిష్క్రమణానంతరం సీత తన యార్తిని వెల్లడిస్తూ-

"ఈపరితాపము నోపను నాపై
కోపమ,జన్మాంతరమున దగిలిన
శాపమ,యిది లక్ష్మణునిందించిన
పాపమ

నీవారావిక, నిజమిది, చావను
నావను వచ్చెదను పతిత పావన
భావమునందున నిల్పుముర స్థిర
స్థావరమును నాకై సుజనావన--

అన్నమాటలుచాలా స్వాభావికంగాసీతామనస్పందననుచాటు చున్నవి

సీతకు తన్నెరిగించు కొనుటకై హనుమంతుడు రామకథను గానముచేయగా "ఈకాకుల వనమున కోకిలపాటలు వినబడె" అనటం చాలా సమంజసంగా సందర్భశుద్ధిగా నున్నది

అక్షకుమారుడు తలపడుచు తనపై శర వర్షమును గురిపించి నవ్వుచు హనుమంతుడు

"బాల సుయోధా-బలమును మెచ్చితి
బ్రతుక గలాడవ - భయమిడెయిచ్చితి

అంటూ అక్షకుమారుని హెచ్చరించుటలో మంచి ఓచిత్యముగలదు

మూలంలో హనుమంతుని ఛంపుటకు రావణుడాజ్ఞాపించినట్లుగా నున్నది హనుమంతుని హిత వచనములు రోచించని రూక్షలోచనుడై వివశుడైన రావణుడు

మండిపడి రావణుడుదుండగునిమెత్త
గాఖండింతునని కఅకు ఖడ్గంబు నెత్తగా

అనుటలో సహజస్థితి కన్పట్టు చున్నది మహాపతివ్రతయగు సీత హనుమంతుని తోకకు నిప్పు రగిల్చిన విషయము తెలిసి అగ్ని దేవుని ప్రార్థించినది తత్ఫలితంగా హనుమంతునకు వేడిమి తగుల లేదు

"జనకసుత శక్తులకు జనని కావున జగ
జ్జనని యాజ్ఞలవలన జల్లబడె ననలుండు
అనిలుండు తన మిత్రు డగటచే నాతండు
అనిలసుతునకు నెట్టి హాని దలపకయుండు "

అనలుండు చల్లబడె అనుటలో ప్రత్యేకత కలదు వేడిమి తగులక పోగా శీతలత్వము కలిగినది. అగ్నివాయువులు సహచరులు కాగా, మిత్రుడు సహకరించగా తానుకూడా సహకరించి నట్లు వ్రాయుట ఉదాత్తత-తన కుమారుని కేసహాయము చేసెనను మాట కంటె యిది ఉత్తమముగా చెప్పబడినది

సీతాన్వేషణలో పర్యవసానమునకై నిరీక్షించుచున్న రాముని యెదుట హనుమంతుడు నిలిచి మొదటగా-

"చూచితి సీతను-వేచి చూచు
నీమార్గము-వేయికనులతో జనకజ"

అనుటలో రామునకు సత్వర సంతోము చేకూర్చబడినది.

సుందరకాండముగా పిల్వబడు యీగాధకు సుందర నామ నిర్వచనము

అతి సుందరముగా శ్రీరాజేశ్వరరావుగారు యిచ్చి యున్నారు

"సుందరము శివము రాముని తత్వము
సుందరత నిధికి సీతాభాండము
సుందరచారిత్రుడు హనుమంతుడు
సుందరత్రయము సుందరకాండము"

సంక్షిప్తముగా వ్రాయుట మే కాని శ్రీరాజేశ్వర రావు గారి కవితా మాధుర్యము ఎంత చవి చూచినా అంతులేనిదిగా వున్నది వారికి శ్రీరామచంద్రుడు ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక

**యడవల్లిపట్టాబి రామశాస్త్రి**
మచిలీపట్నము, ద్వారకామాయి.

"దాశరధాయ విద్మహే సీతావల్లభాయ దీమహి
తన్నో రామచంద్రః ప్రచోదయాత్"

కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం! ఆరుహ్యాక వితాశాఖాం-
వందే వాల్మీకి కోకిలాం

పుంసాంమోహనరూపుడగు రాముని చరితము ఆదికవి విరచితమై శ్లోకరూపమున విలసిల్లియున్నది కుశలవులచే వాల్మీకి ప్రేరణతో గానము చేయబడినది శతకోటిప్రవిస్తరమగు రామకథ అనల్ప ప్రతిభాశాలురగు మహాకవులచే యనువదింపబడి యనేక భాషలలో తలమానికమై విలసిల్లుచున్నది భాస్కరుడు మొదలుగ అనేక కవులు విభిన్న రీతులలోవ్యక్తికరించి యశము నందిరి ఏనోట విన్నా ఎన్నాళ్ళు విన్నా నిత్య నూతనమై భాసించు రామకథ శ్రీగంగా రాజేశ్వరానూదితమై విభిన్న గర్భ వృత్తములతో దేశీ ఛందస్సుల రగడలతో సాగి గాన యోగ్యమై శ్రవణపేయమై శబ్దార్ధాలంకార శోభితమై జాతీయములచే సామెతలచే సంయోజితమై కొనసాగినది.

బహు గ్రంధ నిర్మాతగా పేరు గాంచిన బహు బిరుదావళీభూషితులగు కవిగారి రచనా వైశిష్ట్యము విభిన్న సాహితీప్రక్రియలకు నిలయమై గంగాతరంగిణీ చలన చాలిత మధురనాదబిందు నిష్యందమై సుధామధురమై పాఠకులకు ఆనందము గొల్పగల దనుమాట పునరుక్తమే వార్ధక్య మావహించినను వారి ప్రతిభా సమన్విత మగు దీక్ష దక్షత రామకథ పగిది అనంతమై అనే కానేక రచనలకు దోహద కారి కాగలదని సాక్షాత్పరబ్రహ్మస్వరూపుడగు శ్రీరామ కృపాకటాక్షమున సంపూర్ణ రచన సిరీతినే సాగిస్తారని ఆశిస్తున్నాను

ఇట్లు
**ఉత్తలూరు రామానుజాచార్యులు**
విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు
మంచిర్యాల

ఓం

## వేదపాఠశాల మఠం మంథని

శ్రీమద్గంగారామాయణ సుందర కాండ హనుమద్విజయాఖ్య కవితా సంపుటి యాపాత మధురమై చిత్ర బంధకవితోజ్వలమై పండిత ప్రకాండమానస సరోవరఖబుల నోలలాడు రాయంచమై యలరారుచున్నది ఇందలి కవితా రీతులునన్య సాధారణములు. కవితా చమత్కృతుల కిది నిలయమై హృద్యపద్య గర్భితపద్యమై బంధ గర్భిత పదబంధమై అనితర సాధ్యమై యలరారుచున్నది.

శ్లో॥ శ్రీమద్గంగా తరంగ ప్రతి భటపదవిన్యాసదివ్య పబంధ
ప్రత్యక్షా నంద సంధాయక జనకసుతాజాని సంకీర్తనేన
శ్రీమాద్గంగాన్వయబ్ధి ప్రకటిత శరధృద్రాజరాజేశరాయం
కీర్తిం చాచంద్ర తారం దివిభువి తను తేదివ్య పీయూషతుల్యాం.

శ్లో॥ వర్త తే యస్యజిహ్వాగ్రేవాగ్దేవీనర్తతోత్సుకా
తంగంగాబుధి రాకేందుంనమామి కవిశేఖరం.

శ్లో॥ మతిమంతం శృతిమంతం ప్రకటితరఘురామ సూక్తి కవితా కాంతం
గంగాంబుధి రాకేందుంనమామి రాజేశ్వరం విబుధం.

శ్రీ కొల్లారపు సీతారామ శర్మ.

ఓం శ్రీ సాయిరాం

బహుగ్రంధకర్త, లబ్దప్రతిష్ఠులు బ్రహ్మ శ్రీ గంగారాజేశ్వరరావు గారు రచిం
సుందర కాండము చూచేభాగ్యము కలిగింది ప్రవాహ వేగంతో సాగిపోయే కావ్య
అలవోకగా చదవడానికి అనువైనది వివిధ ఛందస్సులలో వ్రాసిన రామాయణా
అనేకములున్నాయి రగడలో వ్రాసిన రామాయణ భాగమిది ఒకటే నేమో!

అసలు సుందర కాండము సుంద రమమైనది ఆపాత మధురమై
వాల్మీకి రామాయణములో సుందర కాండము ఎంతో అతి మధురమై రాజిల్లినది
మాధుర్యాన్ని తెలుగులో చూపడానికి అనేకులు ప్రయత్నించారు కాని కృతార్థులు క
పోయారు

ఆధునిక కాలంలో సాంప్రదాయ బద్ధమైన మహాకావ్యాలు చదివే
కరువయ్యారు రామాయణభాగాన్ని సులభ సాధ్యము చేసి మామూలు పాఠకు
చదివించేట్లు చేశారు

ఈకావ్యముద్వారా .

వీరి అమరలేఖిని నుండి రామాయణమంతా ఈరీతిలో రా
బహుళప్రచారము పొందాలని ఆశిస్తున్నాను

ఇట్లు

పచ్చిపులుసు వేంకటేశ్వర్లు
ఎమ్ ఏ (తెలుగు), ఎమ్ ఏ (పొలి
బి ఇడి.వి శారద, నెల్లూరు.

# గంగా తరంగిణీ సంక్షిప్త వివరం – నూతన సంస్థ

ఈ సంస్థ కవి శేఖర బ్ర శ్రీ గంగా రాజేశ్వరావుగారిచే 17వ అక్టోబరు 1985న స్థాపింపబడి దాదాపు 10 సం॥రముల దనుక శ్రీవారు సంస్థ కార్య క్రమాలను నిర్వహించారు నాటనుండి ఈ సంస్థకు మార్గదర్శకులు మాజీ MLC శ్రీ గిట్ల జనార్ధనరెడ్డి గారే, ఈ సంస్థ ఒక చక్కని సుస్థిర కార్య వర్గము గల సంస్థ

నాడు ఈ సంస్థ 10 మంది సభ్యులతో వెలసి శ్రీ ఇల్లెందుల సత్యనారాయణ గారి అధ్యక్షతన పెక్కు కార్య క్రమాలు నెరపుకున్నది సాహితీ సమావేశాలు, కవి సమ్మేళనలు; కవితాగోష్టులు, అముద్రిత రచనల ముద్రణా కార్య క్రమం దాతల సహకారంతో, సాంస్కృతిక కార్య కలాపాలు, వార్షికోత్సవాలు, కవి పండితుల ప్రసంగాల నిర్వహణ, సన్మాన సత్కారాలద్వారా సాహితీ సేవ స్థానిక యువ కవుల వివిధ ప్రక్రియల పోటీల ద్వారా వారి ప్రతిభను ప్రోత్సహించుట, మెదలగు కార్యక్రమాలు ఈ సంస్థ ద్వారా నిర్వహింపబడు చున్నవి.

ఈ సంస్థ స్థాపించిననాడు మెదలుకొని 10 సంవత్సరాల లగాయతు కొంత కాలము ప్రధాన కార్యదర్శకత్త్వము డా॥ శు క శ్రీగారును, ఆపై శ్రీ కాకుటూరి సుబ్రహ్మణ్యం గారును నిర్వహించారు

1994లో సంస్థలో క్రొత్త మలుపు ఏర్పడివ్యవస్థాపకులు,మార్గదర్శకులు సూచనలతో ఒక సుస్థిర నూతన కార్య వర్గమేర్పడింది అందు 1 వ్యవస్థాపక అధ్యక్షుడు 2 మార్గదర్శి, 3 కార్య నిర్వాహక అధ్యక్షుడు 3 ఉపాధ్యక్షుడు 4 ప్రధాన కార్యదర్శి 5 సంయుక్త కార్యదర్శి 6 ఆర్ధిక కార్యదర్శి గా రూపొందింది ఇలా రూపొందిన ఈ సంస్థ

వ్యవస్థాపక అధ్యక్షులు - "కవిశేఖర" గంగా రజేశ్వర రావు

మార్గదర్శకులు - శ్రీగిట్ల జనార్ధన రెడ్డి

1 కార్యనిర్వాహక అధ్యక్షు - శ్రీ రేగళ్ళ మురళీధర శర్మ
2 ఉపాధ్యక్షులు - శ్రీ గిట్ల రమణా రెడ్డి
3 ప్రధానకార్యదర్శి - శ్రీకాకుటూరి సుబ్రహ్మణ్యం
4 సంయుక్త కార్య దర్శులు - శ్రీ వాన మామలై నరసింహాచార్యులు, శ్రీ బండారి సత్యనారాయణ, శ్రీ తాటి కొండ రాజగౌడు
5 ఆర్ధిక కార్యదర్శి - శ్రీ గట్టు నరసింహ ప్రసాద్
6 హితవరులు - శ్రీ మాదాడి ప్రభకర రెడ్డి, శ్రీ చెప్యాల రామకిషన్‌రావు

ఈ సంస్థ పెక్కు కార్య క్రమాలను నిర్వహిస్తూ దాతల ఆర్థిక సహకారంతో ఆముద్రిత గ్రంథాలను ముద్రింప జేసి ఆ విష్కరణ కార్యక్రమాలను నిర్వహించింది సారస్వత సమితి కాబట్టి సాహితీ సభలు, సంగీత నాట్య కచ్చేరీలు నిర్వహించి ప్రజలను అలరింప జేయుటలో కృతకృత్యత నొందింది 26 మార్చి 1997 న ఈ సంస్థ జిల్లా రిజిస్ట్రారు కార్యా లయం ద్వారా (1488/1997) నెంబరుతో రిజిస్టరు సంస్థగా సుస్థిరతను పొందింది ఈ సంస్థకు ఏక్సల్ ఇండ స్ట్రీస్ యాజమాన్యం నుండి ఆ సంస్థ నాటి మెనేజింగ్ డైరెక్టర్ శ్రీ గట్టు నారాయణ గారి ద్వారా 20,000 రూ॥లును గంగా రాజేశ్వర రావు గారు 5,000/- రూ॥ లును, శ్రీమర్వాకధ నంజయగారు 50 డాలర్లు 1116/- ఇండియన్ కరెన్సీయును సంస్థకు దాతలుగా సమర్పించిరి. ఈ ప్రకారం సంస్థకు 28,073/- రూ॥ నిధి ఫిక్స్‌డ్ డిపాజిటులో వేయనైనది మొత్తం (26,116/-)

ఇంతదాకా కొన సాగుచున్న ఈ సంస్థ కార్య వర్గ సభ్యులలో సంస్థ ప్రధాన కార్యదర్శి శ్రీ కాకుటూరి సుబ్రహ్మణ్యం గారు ప్రభుత్వోద్యోగి జూ కా. మంథనిలో పనిచేసి ఉద్యోగ విరమణ జరిగిన మూలంగా సంస్థ కార్య వర్గం ఆతని స్థానాన్ని నింపే నిమిత్తం గా కొద్దిపాటి మార్పులు చేర్పులు చేయుటలో ఈ క్రింది విధంగా ఒక నూతన సుస్థిర బాడీ ఏర్పడింది

వ్యవస్థాపక అధ్యక్షులు - కవిశేఖర బ్ర శ్రీ గంగా రాజేశ్వర రావు

మార్గదర్శకులు - శ్రీ గీట్ల జనార్ధన రెడ్డి

నూతన కార్యవర్గము

1 కార్య నిర్వాహక అధ్యక్షులు- శ్రీ రేగళ్ళ మురళీధర శర్మ

2 ఉపాధ్యక్షులు - శ్రీ గీట్ల రమణా రెడ్డి, శ్రీ పి రాజేశ్వర రావు

3 ప్రధాన కార్యదర్శి - శ్రీ గట్టు నరసింహప్రసాద్

4 సంయుక్త కార్య దర్శులు - శ్రీ శీల పరాంభావు, శ్రీ వానమామలై నరసింహ చార్యులు

5 ఆర్థిక కార్య దర్శి - శ్రీ తాటికొండ రాజగౌడు

6 హితవరులు శ్రీమాదాటి ప్రభాకరరెడ్డి

శ్రీ చెప్యాల రామకిషన్‌రావు

| | | | |
|---|---|---|---|
| 7 | నిర్వాహక కార్యదర్శి | | |
| 8 | సంపాదక కార్యదర్శి | - | శ్రీమతి ప్రతిభారాణి |
| 9 | సంచాలక కార్యదర్శి | - | శ్రీమతి అవధానుల సుమతి |
| 10 | ప్రచారక కార్యదర్శి | - | శ్రీ దొంతుల లింగ మూర్తి |

ఇది నేటి గంగా తరంగిణీ సారస్వత సమితి మంథని వారి నూతన సభ్యుల వివరణ వీరు ఈ సంస్థకు సాయ శక్తులా సేవలనందిస్తూ ఉంటారు

రేగళ్ళ మురళీధర శర్మ,
అధ్యక్షులు,
గంగాతరంగిణీ సారస్వత సమితి,
మంథని - 505 184



గ్రంథకర్త
**కవిశేఖర, గంగా రాజేశ్వరరావు**



తాతసేవలో మనుమరాలు
**చి॥ కుమారి స్రవంతి**

చిన్న కుమారుడు
చి॥ మనోహరరావు
కుమారిత

ఓం

## ప్రస్తావన

రామాయ రామభద్రాయ-రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ - సీతాయాః పతయే నమః

## రగడలు

ఆంధ్రమహాభాగవతరచనా భాగ్యము మహాకవి శ్రీపోతనామాత్యు దక్కినట్లే తెలుగులో కేవలం రగడ కావ్యం వ్రాసే అదృష్టం నా కొరకు వేచి ఉ దంటే ఆ సీతారాముల కృపాకటాక్ష వీక్షణ విశేషమే ప్రస్తుతం రగడల గుఱి వివరింతము

*లాక్షణికులు నవవిధరగడలను పేర్కొన్నారు.*

1 హయప్రచారరగడ - మూడు మాత్రలు - జల్పతాళము

2 తురగవల్గన గతిరగడ - హయప్రచారమున ద్విగుణము

3 విజయమంగళరగడ - తురగవల్గన గతికి ద్విగుణము

4 మధురగతిరగడ - నాలుగు మాత్రలు - ఏకతాళము

5 హరిగతిరగడ - మధురగతికి ద్విగుణము

6 ద్విరద గతి రగడ - అయిదు మాత్రలు - జంపెతాళము

7 విజయభద్రరగడ - ద్విరద గతికి ద్విగుణము

8 హరిణగతిరగడ - ఏడు మాత్రలు - త్రిపుట తాళము
(3+4=7)

9 వృషభగతిరగడ - హరిణగతికి ద్విగుణము

## లక్షణములు

1 రగడలు మాత్రాఛందోబద్ధములు - లయాత్మకములు

2 ద్విపద వలె రగడలో రెండు పాదాలుండును

3 ప్రతి పాదములో నాలుగు కూటము లుండును

4 కూటమనగా ఒకటి రెండు లేక మూడు గణముల మాత్రల సమూహవ

5. ఇందు యతి ప్రాసలతో పాటు అంత్య ప్రాస నియమము కలదు

6 రెండు కూటముల తరువాత యతి స్థానము

7 హగణ, జగణ, యగణములు నిషిద్ధములు(ఏలయన వీని వలన నడక కుంటు బడును)

వీనికి ఉదాహరణములు ఆంజనేయ విభక్త్యష్టములో చూడనగును ఈగ్రంధములో ప్రాస యతి వాడబడినది

## ప్రత్యేక రగడలు

ఈకావ్యము లో అపవాదములుగా కొన్ని రగడలు దొర్లినవి వానికి నామ కరణ లక్షణములు సూచితము

1 ప్రవాళ రగడ- 6మాత్రలు - రూపకతాళం ఇందు రెండు, మూడు, నాలుగు మాత్రా గణములు వచ్చును (2+4+=6, 3+3=6, 2+2+2=6)

2 మహాప్రవాళరగడ- ప్రవాళరగడకి ద్విగుణము

3 మరాళగతిరగడ- 8 మాత్రలు - ఆదితాళము (4+4=8, 5+3=8, 3+3+2=8)

4 మహామరాళగతిరగడ - మరాళగతికి ద్విగుణము

5 రగడమాల శఏక ప్రాస యుక్త బహురగడల సమూహము

మద్విరచిత పార్వతీ చరిత పరీక్షిచ్చరిత కావ్యాలలో రగడలు, గర్భాలు మరియు బంధాలను చూడ నగును.

# కృతజ్ఞతలు

లర్థించి నంతనే "హనుమ ద్విజయ" కావ్య ప్రమరణకై రూ 8,130/- ఆర్థిక సహాయం దయతో అనుగ్రహించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల స్వామి వారికి అనేకానేక నమస్కృతులు, అక్కడి పాలక వర్గమునకు కృతజ్ఞతలు ఈ గ్రంధముద్రణకు రూ 1,116/- ద్రవ్యసహాయం అడుగకముందే అంద జేసిన శ్రీతంగెళ్ల పల్లెచక్రపాణి, కొడుకు "శ్రీ టి మధూకర్ ప్రిన్సిపాల్ జూనియర్ కళాశాల మంథని" గార్లకు మరియు రూ 1,116/- ఇచ్చిన శ్రీమతులు మారుపాక విజయలక్ష్మి సత్యనారాయణ దంపతులకు ఆశీః పూర్వక కృతజ్ఞతలు కోరినంతనే తమ అమూల్యాభిప్రాయములు ఇచ్చినందులకు శ్రీగీట్ల జనార్దన రెడ్డి గారికి ప్రేమ పూర్వక కృతజ్ఞతాభివందనములు శ్రీయడవెల్లి పట్టాభి రామూర్తిఇ నువిలీపట్నము, శ్రీఉత్తలూరు రామానుజాచార్యులు, విశ్రాంత ఆంధ్రోపన్యాసకులు, మంచిర్యాల శ్రీ పచ్చిపులుసు వెంకటేశ్వర్లు, లెక్చరర్ నెల్లూరు, మరియు శ్రీ కొల్లారపు సీతారామశర్మ అధ్యక్షులు సంస్కృత పాఠశాల, మంథని గార్లకు కృతజ్ఞతా పూర్వక వందనములు ఈకావ్యముద్రణ యందు నామీది ప్రేమాభిమానములతో సర్వవిధ సహాయ సహకారములనందించినసర్వశ్రీ రేగళ్ళమురళీధరశర్మ "గంగా తరంగిణీ సారస్వతసమితి అధ్యక్షులు, శ్రీ గజానన్ తామన్, లెక్చరర్, తాటికొండ రాజగౌడ్,వార్డుమెంబర్, గ్రామ పంచాయితి మంధని, శ్రీ రేపాక వెంకటయ్య, M E O ముత్తారం మండలము గార్లకు ప్రేమపూర్వక కృతజ్ఞతలు మరియు ఇతరత్రా సహకరించిన వి గంగా మనోహర్, రాజేంద్ర దంపతులు, కుమారి స్రవంతులకు ప్రేమాశీస్సులు అభిమానముతో చక్కగా గ్రంధ ముద్రణ గావించి యిచ్చినందులకు శ్రీ తోట రాజలింగం, శ్రీలక్ష్మి ప్రెస్ ప్రొప్రయిటర్ గారికి కృతజ్ఞతలు

ఓం శాంతి: శాంతి: శాంతి. గ్రంధకర్త

# ఆంధ్రప్రదేశ్ కళా నీరాజన దినోత్సవం

జిల్లా కళా నీరాజన పురస్కారం

28 మే 1995 శ్రీ గంగా రాజేశ్వరరావు

తరతరాల

భారతీయ కళా సాంప్రదాయానికి

వన్నె తెచ్చి

కళామ తల్లికి విశిష్ట సేవ చేస్తున్న

మనరాష్ట్ర కళామూర్తులను సత్కరించాలని

ఆంధ్రప్రదేశ ప్రభుత్వం నిర్ణయించి

భారతీయ కళారంగంలో ఆదర్శ ప్రాయులైన

విశ్వవిఖ్యాత నట సార్వభౌమ

డా॥ నందమూరి తారక రామరావు గారి

జన్మదినమైన ప్రతి మే 28 వ తేదిని

కళా నీరాజన దినోత్సవంగా

పరిగణించిన శుభ సందర్భముగా

సాహిత్యరంగంలో మీరు చేసిన చేస్తున్న

విశిష్ట కళాసేవకు అభినందిస్తూ

సగౌరవంగా

మీకు సమర్పిస్తున్న

కళానీరాజన పుర స్కారం

sd.

కలెక్టర్

కరీంనగర్ జిల్లా

# ఉపక్రమము

మరాళగతిరగడ

రామకృష్ణరాయని శ్రీముఖమున -
రాముని శ్రీముఖమును నే గాంచితి।
రామాయణ మణిమాలను సీతా -
రామార్పణముగ గూర్పగనెంచితి!!

గంగారాజేశ్వరవిరచిత శ్రీ-
గంగారామాయణసుమహారము !
శృంగారించెద రాముని గళమున-
భృంగరాజి పాడగ ఝుంకారము!!

హరిగతిరగడ

సాంగోపాంగము చదివిన బాడిన -
శ్రవణము సేసిన సత్యవ్రతులకు।
భంగపడును భవభయము సుజనులకు -
పరమ సుఖంబులు వరలు సుమతులకు!!

మరాళగతిరగడ

నిండెను దొమ్మిది పదులు వర్షములు -
పండెను జీవితఫలమును, గ్రుంకక।
ఉండెను నాయు వనెడు రవి పడమర, -
నిండుకొనును బ్రాణతైల, మింకన్!!

కాయ మెపుడు పడిపోవునొ తెలియదు
ఆయిత పడవలమును బిలుపునకై!
ఆయువు సరిపడునో లేదో రా -
మాయణరచనాపూర్ణముకొఱకై !!

సుందరకాండము వ్రాసిన వారికి-
నందునురామాయణరచనాఫల।
మందుకు దానిని మున్ముందుగనే-
నందింతును బుధవరులు మెచ్చ నిల।।

సుందరము శివము రాముని తత్వము-
సుందరత నిధికి సీతయ భాండము।
సుందరచారిత్రుడు హనుమానుడు-
సుందరత్రయము సుందరకాండము।।

మెల్ల మెల్లగా కంటి చూపుసన
గిల్లుచునున్నది, యిక కర్ణంబులు।
చల్లగాలు పనిచేయుము మే మని
సమ్మెకు దిగినవి బలహీంబును।।

ఎల్లకాల మీ దేహంబును మే
మే మోయగా వలెనా? యనికాళ్లను।
చెల్లిపోయె మా బలమిక యే పని
చేయ జాల మని చేతులు వల్కెను।।

ఆశ మాత్రమే మిగిలనది శక్తు-
లన్ని యుండిగినను రామాయణమును।
శేష రహితముగ చేయుడకు మజుల
జెంద వలెన? జన్మం బనిపించును।।

~~ఈశు~~ డన్ని చూచును, సల్పువు నీ-
యీప్సితమును రాములకు నర్పణము!
ఆశయు దుఃఖములకు మూలంబు ని-
రాశయు సుఖశాంతులకు దోరణము

ఓం
శ్రీ గణేశాయ నమః
శ్రీ సరస్వత్యై నమః
శ్రీరామ చంద్ర పరబ్రహ్మణే నమః
శ్రీ హనుమతే నమః

# గంగారామాయణము

# హనుమద్విజయము

(సుందరకాండము)

రగడకావ్యము

## దేవతా ప్రార్థన

### మధురగతిరగడ

శ్రీ గణనాయక - సిద్ధి వినాయక।
యోగజవదనా - యో శుభదాయక॥
నా గతి నీ వని - నమ్మితి వినరా।
నాగ విభూషణ - నందన గనరా॥

### మధురగతిరగడమాల

భారతమును నే - వ్రాసితి నంటివి।
కీరితులను వి - ఘ్నేశ్వర గొంటివి॥
కారుణికా నా - కావ్యము గొప్పగ।
బూరితి సేయర - బుణ్యము లొప్పగ॥
శారద జ్యోత్స్నా - సమదర హాసిని।
సారస సంభవు - సఖి మృదుభాషిణి॥
శారద। వికసిత - సరసిజనేత్రీ।
కోరిక దీర్చవె - కోమల గాత్రీ॥
కచ్ఛపి వీణను - గదలించుచు నా।
యిచ్చను శ్రుతి గా - వించి సుజఘనా।
మచ్చె కంటి రామాయణకథ నీ।
స్వేచ్ఛ కొలదిఁ బాడింపుము జననీ॥

ప్రవాళ రగడ

కలియుగవైకుంఠము దిరు -
మలఁ దిరుపతిఁ బద్మావతి !
నలువేల్మంగను గాదని, -
యార్తత్రాణా! శ్రీపతి! ॥

వెలసితి శ్రీ వేంకటేశ! -
వేయి నమస్కృతులు నీకు!
గొలుతుము నిను శ్రీనివాస!
గోర్కెలెల్ల నిమ్ము మాకు!!

హరి గతిరగడ

కరుణాకర! శంకర! భక్తవశం-
కర! యభయంకర! దుష్టభయంకర!
పరశు డమరుధర! గంగాధర! విష-
ధరధర! భవ! భవహర! హర! శశిధర!!

గిరిజకుఁ జెప్పిన రామకథను నా-
కెఱిగింపు గిరీశ్వర! గిరిజేశ్వర!
పురహర! వేములపుర రాజేశ్వర!
పరిరక్షిత గంగారాజేశ్వర!

## కృతిపతిస్తుతి

మరాళగతిరగడ

శ్రీరామా నినుఁ దలచు జనులు సం-
సారశరధి నవలీలఁ దరింతురు!
ఓ! రామా నీ నామజపిస్తులు-
ఘోరభవబంధనములను ద్రెంతురు!!

కారుణ్యాంబుధి నీ శరణార్థులం-
గల్యాణపరంపరలు వరించును!
క్రూరులు నిను గాదను గర్విష్ఠులు-
కుమతుల సిరి దుర్విధియ హరించును

## మత్తకోకిలగర్భవృషభగతిరగడ

రామ రాఘవరామ కోసల-
రాజనందిననందనా! ప్రియ-
కామితార్థఫలప్రదాయక-
కంబుకంఠ నమోస్తు తే z భయ!
సామజార్తివినాశకా క్షితి-
జామనోంబుజ భాస్కరా నయ-
శ్యామసుందర భక్తచందన-
సారసాక్ష జయోస్తు తే z వ్యయ !!

### మత్త కోకిల

రామ రాఘవరామ కోసల-
రాజనందిననందనా।
కామితార్థఫలప్రదాయక-
కంబుకంఠ నమోస్తుతే ।
సామజార్తివినాశకా క్షితి-
జామనోంబుజభాస్కరా ।
శ్యామసుందర భక్తచందన-
సారసాక్ష జయోస్తు తే ।

## ఉత్సాహవృత్తగర్భతురగవల్గనగతిరగడ

శ్యామలాంగ నీదు స్మరణ - యడపు - భవభయంబు రామ।
కోమలమృదుపాదసేవ - గూర్చు విమలభక్తి రామ॥
తామరసనునేత్ర నాకు - దాపు ప్రాపు నీవ రామ।
రామచంద్ర రాఘవేంద్ర - రార నన్ను బ్రోవ రామ॥

## ఉత్సాహవృత్తము

శ్యామలాంగ నీదు స్మరణ -
యడపు భవభయంబు రా।
కోమలమృదుపాదసేవ
గూర్చు విమలభక్తి రా।
తామరసనునేత్ర నాకు
దాపు ప్రాపు నీవ రా।
రామచంద్ర రాఘవేంద్ర
రార నన్ను బ్రోవరా॥

## ఆంజనేయవిభక్త్యష్టకము

### విజయ మంగళరగడ

అంజనీసుతుండు మారు-
తాత్మజుండు పావనుఁడు శి-
వాంశసంభవుండు నాశ్రి-
తాళి దుఃఖచయముఁ బాపు।
భంజితాసురుండు బాల-
భాస్కరఫలహారకుండు-
ప్రాంజలిముకుళితుఁడు రామ-
భక్తవరుఁడు మనకుఁ గాపు॥

మధురగతిరగడ

క్లేశవినాశునిఁ - గీర్తి విశాలుని।
కీశవరిష్ఠుని - కేసరిబాలుని॥
దాశరథి ప్రియ -దాసు నుదారుని।
దాసోహ మ్మని - తలతును ధీరుని॥

హరిణగతిరగడ

జ్ఞానదినమణి హనుమ చేతను-
గలిమల ధ్వంసకుని చేతను।
బీనవక్షస్థలుని చేతను-
బేరు మోసిన బలుని చేతను॥

మౌనిసుర సేవితుని చేతను-
మానవేంద్రుని దూత చేతను।
మానవులు రక్షింపఁ బడుదురు-
మారుతాత్మజుఁడు - హరి చేతను॥

ద్విరదగతిరగడ

ఇష్టవరదుండును గ - పీశసచివుని కొలుకు।
దుష్టదానవదైత్య - దోర్బలహరుని కొలుకు॥

సాష్టాంగముగ నమ - స్కారములు హరి కొలుకు।
అష్టోపచార పూ - జార్పణము గపి కొలుకు॥

తురగవల్గన గతిరగడ

జనకజార్తి హరుని వలన-
సకల భువనసేవ్యు వలన।
ఘన బలాఢ్యు హనుమ వలన-
గలుగు సుఖ శుభయదు వలన॥

వనజనాభుదాసు వలన-
దనుజవన వినాశు వలన।
ననిలజుఁడు గుణాఢ్యు వలన-
నఘము వాయు ననఘు వలన॥

## విజయ భద్రరగడ

భీమ విక్రమునకు వి - భీషణాకృతునకుఁ-
బ్రేమవార్ధికి విజిత - విషయ వాసనున కుఁ।
గామి తార్థము లిచ్చు - కల్పభూరుహము కుఁ-
గ్రామస్థితునకు సం - గ్రామ జితరిపునకుఁ!!

## హరిగతిరగడ

అతులిత గుణ సంపన్నుని యందున -
నఖిల సురగణారాధ్యుని యందున।
పతితోద్ధారుఁడు పావని యందున-
ప్రవిమల భక్తి గలుగు హరి యందున॥

## వృషభగ తిరగడ

శమదమాదిసుగుణగరిష్ఠా-
సాధునుత పింగళసునేత్రా-
స్వామి కార్యదురంధర చతుర-
స్వర్ణశైల సురుచిర గాత్రా!
అమిత బల విక్రమ పరాక్రమ-
యమరనుత దుష్కృతలవిత్రా-
యాంజనేయ సుజన శరణ్య* స-
హస్రనతు లివె శుభచరిత్రా॥

హయ ప్రచార రగడ
అంజనీ సుతా- ష్టకంబు।
రంజకము సు - రద్రుమంబు॥

భంజితభవ భయ మమృతము।
సంజనితప్రశాంతియుతము॥

## కృతి సమర్పణ

విజయభద్రరగడ
శ్రీరామచంద్రునకు - సీతాసమేతునకు-
శ్రితజనోద్ధారునకు - శ్రీవత్సవక్షునకు।
శ్రీరమాహస్తసం - సేవితపదాబ్జునకు-
శ్రీమూర్తికిఁ స్వజన - శ్రేయోభిలాషునకు॥

కౌసల్యతనయునకుఁ - గారుణ్యసింధునకుఁ-
గోసలాధీశునకుఁ - గోదండహస్తునకు।
దాసపోషునకుఁ - దానవవిదారునకు
వాసవార్చితునకుఁ - వైకుంఠధామునకు॥

సృష్టిస్థితిప్రళయ - వృత్తిప్రధానునకు-
స్రష్టలకు స్రష్ట కవ - శిష్టునకు శ్రేష్ఠునకు!
అష్టప్రకృతుల కాది - కాద్యంతరహితునకు-
శిష్టరక్షణదుష్ట - శిక్షణసమర్థునకు॥

ధర్మవర్తనునకును - ధర్మస్వరూపునకు -
ధర్మరక్షునకును - ధర్మప్రచారునకు।
నిర్మలహృదయునకును - నీరేజనేత్రునకుఁ-
గర్మసాక్షికినిఁ ద - త్కర్మవిచ్ఛేదునకు॥

ఏకనారీవ్రతున - కేకనారాచునకు -
నేకవచనునకునున - నేకావతారునకు!!
కాకుత్థ్సతిలకునకు - లోకైకవంద్యునకు -
లోకరక్షకునకు న - లౌకికసమర్థునకు !!
దీనబాంధవునకుఁ - దివ్యప్రభావునకు -
దానవారణ్యఘన - దావాగ్నిశౌర్యునకు!
మానవాకారునకు - మర్యాదరామునకు-
జానకీనాథునకు - జగదేకవీరునకు !!
కృతిసమర్పణ సేసి - కీర్తివంతుడ నైతి -
గృతకృత్యు నైతి స - త్కృతికిఁ బాత్రుడ నైతి!
నతిసుకృతఫలమున గృ - తార్థుడను నే నైతి-
మితి లేని యానంద - మిళితాత్మకుడ నైతి!!

# ప్రథమాశ్వాసము
# సముద్రోల్లంఘనము

కందగర్భహరిగతిరగడ

శ్రీరామ! య సీమదయావారిధి-
సీతామృదుకరభావితచరణా!
మారుతిహృదయాభరణా! వీరా -
మారారినుత యవిద్యా హరణా!!

## కందము

శ్రీరామ! యసీమ దయా!
వారిధి సీతామృదుకర - భావితచరణా!
మారుతి హృదయాభరణా!
వీరా! మారారినుత య - విద్యాహరణా!!

## వానరవిచారము

### ప్రవాళరగడ

శ్రీరామాజ్ఞలు గొని సీ -
తారమణిని - గాలించిరి।
వారిధి కడc బయనము గపి-
వీరవరులు సాలించిరి॥
దారుణభీషణతరంగ -
ఘోరయుదధినిం గాంచిరి।
దారి నడ్డెడు మహోకా-
లోరగ మని మది నెంచిరి॥
ఆకాశపు గంగ నంట-
నలలు మింటి వరకు దూకు।
భీకరఘోషలను ఫెడేల్ -
ఫెడే ల్మనుచు దరిని దాకు॥
ఝషమకరతిమింగిలక -
చ్ఛపములు విచ్చల విడిగా।
వృషభములు మదించి తిరుగు-
విధిc జరించు వడివడిగా॥

### మరాళగతిరగడ

వననిధి దాటగ లేము దాటినను -
దనుజుల గెలువగ లేము గెలిచినను।
వనజముఖిని సీతను గని యిద్దరి-
వఱకు జేరగాc జాలము మే మను॥

కొనుచుఁ దమదు చెక్కిళ్లను జేతుల-
నునిచి మిక్కిలి విచారగ్రస్తులు!
గనుచు నొకరి మో మొక్కరు దుఃఖా-
క్రాంతు లైరి వానరులు ప్రశస్తులు!!

విజయభద్రరగడ

జ్ఞానవానుండు - హను - మాను డే డని జాంబ
వానుండు సూచి యొక - ద్రుమాను క్రిందను గనియె!
వానరేంద్రునకు రఘు - వంశచంద్రుని పద
ధ్యానమగ్నున కుదా - సీనునకు ని ట్లనియె!!

మరాళగతిరగడ

రుద్రాంశంబున జన్మించితి వా-
రూఢప్రజ్ఞుడ వైతి రఘురామ!
భద్రుని నామసుభద్రకవచమున-
భయము వాసితివి రాక్షసవిరామ!!

బాలప్రాయము నందున భానునిఁ -
బండని కబళించితి బలవంతా!
చాల కుపితు డై వజ్రి గొట్టగా-
సహియించితివి గదా! హనుమంతా!!

విజయభద్రరగడ

బలము నీదే కాదు - బలిని గెలిచిన మహా -
బలశాలిరామవిభు - బలము - నీ కుండ గాఁ !
బలుడ ముల్లోకాల - బలము లేకము లైన
భయము నీకా? మహా - బలుడు నీ కండ గాఁ!!

ఈక్షించి ప్రేమఁ గను - లేక్షుండు రాముఁడే-
యక్షీణబలుడ నీ - వనుచు నిను గడు మెచ్చె।
దక్షుడవు గార్యసా - ధకుడ వీవని నమ్మి -
యక్షయపు టుంగరం - బానవాలుగ నిచ్చె॥

నీక్షణం బందు నీ - వీ శరధి లంఘించి-
వీక్షించి జానకిని - శిక్షించి దనుజులను।
అక్షముల మమ్ములను - నంగదప్రభృతులను -
రక్షించు సుగ్రీవ - రామచంద్రాదులను॥

## మధురగతిరగడమాల

అంతయు విని హను - మంతుడు మురిసెను।
స్వాంతంబున నిజ - బలమును నరసెను॥
జింతితకార్యము - సేసెద ననుచును।
బంతమువట్టె ప్ర - భావితు డగుచును॥

ఇంతింతాయెను - నంతంతాయెను।
నెంతో దూరం - బెదుగుచు బోయెను॥
అంతయు దానే - యగుచును బోయెను।
వింతగ మదినిఁ ద్రి - విక్రము డాయెను॥

## మరాళగతిరగడ

కైలాసేశ్వరు వాహనంబు నగు-
ఘనవృషభము వలె వానరర్షభుఁడు।
శైలాకారుఁడు ఱంకెవేయగాఁ-
త్రైలోక్య మదిరె భయపడెను జముడు॥

## హరిగతిరగడ

అబ్బబ్బో ప్రళయ మె యని గ్రహములు-
తబ్బిబ్బయి తమ దారులు దప్పెను।
బొబ్బలు విని రవి భూరిభయమువడ-
మబ్బు లతనిఁ దమ మఱుగున గప్పెను॥

విజయభద్రరగడ

ఉల్లసితవక్త్రుండు - నూర్ధ్వరేతస్కుండు-
నుత్సాహము మొగాన - నుట్టిపడగను లేచెఁ।
బల్లవితహృదయులను - భయవిరహితుల హితుల
బ్లవగేంద్రులఁ బ్రసన్న - భరితదృష్టినిఁ జూచె॥

ఖగములును, మృగము లా - కసమందు, భూమిపై-
గలకలధ్వానములు, - ఘనరవము లొనరించె।
జగదేకవీరునకు - సల్పెను బ్రదక్షిణము-
జయ మనుచుఁ గపికి శుభ - శకునము ల్భాసించె॥

వరఋషులు జయము నిను - వరియించు ననుచుఁ బా-
వనికై యనేకదీ - వన లిచ్చి మురియగా।
సురవరు లనుగ్రహపుఁ - జూపులకు జతచేసి-
శుభము నీ కగు నని ప్ర - సూనములు గురియగా॥

# ప్రయాణ సన్నాహము

మరాళగతిరగడ

గంతును వేసె మహేంద్రనగము పైఁ -
గంపించెను భూకంప మనగ నది।
జంతుపక్షిసంతతు లదరె సురల-
జంటలు మౌనులు జడిసిరి తమ మది॥

ఉత్తరదిక్కున భాస్కరుండు నే-
డుదయించెను విపరీత మి దనుచును।
బిత్తరిలుచు ద్విజు లర్ఘ్యజలము ల -
ర్పింపక నిలిచిరి తూరుపు గనుచును॥

ప్రాక్సతియంభోనిధి యను - బాన్పున-
భానుం డను బాలునిఁ బ్రసవించెను।
దిక్సమాప్తముల కీ శుభవార్తను-
దేజోవార్తాహరు డెఱిగించెను॥

జయరామా। యని హనుమంతుడు భీ-
షణముగ గర్జించె దిశలు మ్రోయగ।
భయమున రాక్షసగర్భంబులు భూ-
పతనము లయ్యెను భామిను లేడ్వగ॥

గురునకు రవి కభివాద మొనర్చెను-
గోసలపతికై నతు లర్పించెను।
సురలకు మునులకు వందనముల నిడి-
సూటిగ నొక పెట్టున గుప్పించెను॥

ప్రవాళరగడ

శతయోజనవిస్తీర్ణము - శరనిధిమకరాలయంబు।
మతి రాముని గొని యొనర్చె - మారుతి యుల్లంఘనంబు॥
రామధనుర్ముక్తము నా - రాచము విధముగ నేగెద!
రామసతిని సీతను నీ - రాతిరి జని నేఁ జూచెద॥

ప్రాణము వోయెడు దరి నొక - పర్యాయము రాము నెవడు।
ధ్యానించునొ భవజలనిధి - దప్పక తరియించు నతడు॥
ఆరాముని చింతనం బ - హర్నిశలును మదిని గలదు!
పారావారం బిది గో - ష్పదము నాకు భయము వలదు॥

అని పలుకుచుఁ దత్క్షణ మే - హనుమ దేహమును బెంచెను।
మును ముందుకు బాహుయుగం - బును మిగులఁ బ్రసారించెను
ఘనవాలము మింట నెగురఁ - గాకోదర మనిపించెను।
గనుచు నూర్ధ్వదిశను దనదు - కంఠము రుజువుగ నుంచెను॥

ఆకుంచితపదయుగళుం - డనిలవిక్రముడు మించెను।
ఆకాశపథమున దక్షి - ణాభిముఖుడు పయనించెను॥
దక్షిణాక్షి కిష్కింధను - దశరథరామునకు నదరె।
రాక్షసాధిపతికి సీత - కా క్షణమున వామ మదరె॥

హరిగతిరగడ

చండబలుని తీవ్రగతిసృజితములు -
ఝంఝామారుతములు చెలరేగెను।
ఉండుండుము ని న్నెత్తుకొనెద నని-
యురుకుచు వెంటఁ బ్రభంజను డేగెను॥

మధురగతిరగడ

పావని నంపెడు - బంధుజనము లనఁ।
బూవులు గురియుచు - భూరుహములు సన॥
దేవవిమానాల్ - దివికై మఱలెను।
దేవిని గన రవి - తేజుఁడు దఱలెను॥

ద్విరదగతిరగడ

జలనిధిని నేర్పడిన - సంక్షోభమును గాంచె।
జలచరము లన్నియును - జడిసి యాక్రోశించె॥

హరిగతిరగడ

జగములు భయమున గడగడ వడకె భు-
జగములు రయమున బిలముల దూరెను।
నగములు వనములు నల్లల్లాడెను-
మృగములు దిశలను శరణము గోరెను॥

ద్విరదగతిరగడ

వాయుసుతు డా వేళ - బల వీర్యములఁ బెంచె।
వాయుమండల మందు - వాని వేగము మించె॥

నిర్వికారాత్మ్ముండు - నింగిలోఁ బయనించెఁ!
బర్వమున నుప్పొంగు వారినిధి యనిపించె॥

# సురసానిరోధము

ప్రవాళరగడ

ఆ వజ్రాంగుని బావని-
నమరులు గని యిట్టి బలుడు।
నీ వేళను లంకఁ బ్రవే-
శింపఁ గలడ? యచంచలుడు॥

అనుచు వితర్కించుచు సుర-
సాఖ్యానాగమాతఁ బిలిచి।
పనిచిరి కపివరుని బుద్ధి-
బలము బరీక్షింపఁ దలచి॥

సురల యానతినిఁ గొని యా-
సురసతి భువి దిగి వచ్చెను।
అరసెను మదిలోన, నుపా-
యం బొక్కటి స్మృతిఁ జొచ్చెను॥

హనుమంతుఁడు బలవంతుం-
డైన, బుద్ధి గన నెంచెను।
ఘన మగు దన యాలోచన-
గార్యరూపమున నుంచెను॥

భీకరకాయంబు దాల్చి-
భీషణరవమున నార్చెను।
ఆకాశము నావరించ-
నట్టహాసము నొనర్చెను॥

ఆహా!హా! కడుపు నిండ -
నాహారము లభియించెను!
ఓహో!హో! సుదిన మి గని-
యుత్సాహము ప్రకటించెను!!

ఆకలి యగుచున్నది నా-
యాననంబుఁ జొరుపు మనుచు!
నాకవాసిని దెలిచె వద
నంబు యోజన మది గనుచు!!

కేసరిసుతు డనెను నేను-
గీర్తిమంతు డగు రఘుపతి!
దాసకోటిలో నొకడను-
దారి విడువు మమ్మ సుమతి!!

రామకార్యమును గూరిచి-
లంకకు నేఁ బోదు నిపుడు!
రామసతిని సీతను గని
రాముల కెరిగించి యపుడు!!

తిరిగి వచ్చి నీ కోరిక -
దీర్తు నమ్మ నన్ను నమ్ము!
వరము గోరుచుంటిని శ్రీ
వరదుని పై యాన సుమ్ము!!

బొంకి బోర్లవేయు వారిఁ-
బోలెడు మందినిఁ జూచితి!
నింకఁ జెల్ల విట్టి కల్ల-
లింత వరకు నే వేచితి!!

అనుచు మ్రింగఁ బోవు నంత
నైదామడ లెదిగెను హరి!
గనుచు సురస ద్విగుణము వ-
క్త్రంబు సాచి రమ్మను తఱి!!

వాయుసుతుఁడు పెంచెను ము-
ప్పది యోజనములు దేహము!
పాయక తెఱచె సురస యే-
బది యామడ లా యాస్యము!!

ఆగక మతిమంతుం డ-
త్యంతసూక్ష్మరూపు డగుచు!
వేగఁ జొచ్చి యాపె నోట
వెడలి వచ్చి యనెను నగుచు!!

అమ్మ! నీ వరం బిచ్చితి
నానతిమ్ము పోయి వత్తు!
సమ్మతిఁ సీతమ్మ జాడ
సరగునఁ దప్పక య తెత్తు!!

హరివరు డిట్లన నాయమ
యమరవంద్య! నీ కభయము!
వరియించెడు నిన్ను వీర్య-
వంతా హనుమంత జయము!!

అని దీవన లిచ్చి నాగు-
లమ్మ దివినిఁ గూర్చి యేగె!
విని ముదమునఁ గపివరుండు
వినువీధిని ముందు సాగె!!

## మైనాకాతిథ్యము

### తురగవల్గనగతిరగడ

ప్రజ్వరిలుచు నెత్తి పైన
భాస్కరుండు వెలుగ హనుమ।
యుజ్జ్వలప్రతాపుఁడు సను-
చుండె నపరభానుఁడు సుమ॥

మేరుధీరుదేహఛాయ
మిగుల బొల్చు జలము లందు।
భూరినావ వేగఁ దరలి
పోవు ననగ జలధి యందు॥

మందమారుతములు వీవ
మబ్బులు గొడుగులను బట్ట।
మందరాద్రితుల్యు డరిగె-
మౌనివరులు జేలువెట్ట॥

మండు టెండలకు నడలఁడు
దండి వేడిమికి జడియఁడు।
మెండు చెమటలకుఁ దడియఁడు
నిండు మోదమును విడువఁడు॥

గరుడుఁ డమృతమునకు దివికిఁ-
గదలు చుండె నో యనంగ।
సరసర నా లంకకు వన-
చరుడు పయన మై చనంగ॥

### ద్విరదగతిరగడ

శరధిరా జది గాంచి - శైలరాడ్సుతుఁ బిలిచి।
కరవలి కొమరు భావి - కార్యంబు మదిఁ దలచి॥

రఘురాము బంటు హరి - రామదాసుఁడు వచ్చె।
నఘహరుని హరుని కళ - లన్ని వెంటను దెచ్చె॥

అఘటనఘటనకృతు స - మర్చనల సేవింపు!
మఘవాను భయము మటు - మాయంబు గావింపు॥

**విజయభద్రరగడ**

సగరాన్వయుల చేత - సంవర్ధితుడ నగుట
సాగరుం డని వచ్చె - సార్థకం బగు పేరు।
నగరాజపుత్ర యా - నాడు మొదలుగ నే ఋ-
ణగ్రస్థు నైతి నీ - నాటి కయ్యది దీరు॥

సగరకులజుడు రాము - చంద్రు డాతని జాయ
జానకీసతి యాపె - జాడలకు హరి వెడలె।
నగధీరు కీశవరు - నకును నాతిథ్యంబు-
నయ మొప్ప నిడుము కపి - నాథుండు గడు బడలెఁ॥

నని యిట్లు మైనాకు - డాజ్ఞాపితుం డగుచు
నా క్షణంబున లేచి యబ్ధి పైనను నిల్చెఁ!
గనకమయరుచిరశృం - గములచే వెలుగుచును
ఘనత్రికూటాద్రి యన గాఁ దేజమునఁ బొల్చె॥

హనుమంతు మార్గంబు - నడ్డగించుచు రెండు
హస్తములు జోడించి - యత్యంత నమ్రుడై!
వనచరేంద్రా మీకు - వనసధేంద్రుని ఘన-
స్వాగతం బనుచు నా హ్వానించెఁ బ్రీతుఁడై॥

పక్షములు ఖండింప - వజ్రాయుధుఁడు రాగ
రక్షించె వేగ వా - రాశిలోఁ ద్రోసి నను।
దక్షుఁ డనిలుండు మీ - తండ్రి దీనావనుఁడు
దాసుడను మీ యెడ స దా సే కృతజ్ఞుడను॥

ప్రవాళరగడ

ఫలములు పక్వములు దినుము
జలములు మధురములు ద్రావు।
మలయానిలములు వీవగ
నలసట దీర్చుకొను మీవు॥

చిలుక తేనెపలుకులు గో-
కిల కలరవములును వినుము!
పలురకముల పూలవాస -
నల నాఘ్రాణంబు గొనుము॥

అళుల బృందగానముల, నె-
మళుల జంట నృత్యమ్ముల, ।
నలరుచు విను, గను శ్రోత్రా-
క్షుల కాహ్లాదకరమ్ముల॥

హరిగతిరగడ

అని మైనాకుం డాడు పలుకులకు
హర్షపులకితాంగుం డై ధీరుడు।
వినిపించెను దన వివశత నంతయు
వీరుడు నా సామీరి గభీరుడు॥

మరాళగతిరగడ

ముందర గలదు బృహత్తర కార్యము
భోగవిశ్రమముల కిదా సమయము!
తొందరగాఁ బరుగిడు కాలము తో-
డ్తోడఁ బోని యెడ నిడవలయుఁ గ్రయము॥

ప్రేమ తోడ నాహ్వానించితి సం-
ప్రీతుడ నైతిని నే గిరిరాజా।
రామకృపాధారావర్ష మనవ
రతము గురియు నీ పై రవితేజా॥

అనుచును దన మృదుకరకరసరసిజ-
మున స్పృశియించె నతని శీర్షంబును।
ఘన మగు వేగంబునఁ దన పయనము
గావించెఁ బ్రదర్శించె బలంబును॥

కాంచనదేహుడు రువ్వడిగా లం-
కాపురి కై మార్గము సవరించెను।
ఎంచగ గంగానది గైలాసము
కేతెంచుచు నున్నది యనిపించెను॥

**సింహికాసంహారము**

బాగుగ వీచెడు నెదురు గాలిలో
నేగము దగ్గిన యోడ విధమ్మున।
సాగెడు బయనం బద్ది యమాంతం-
బాగిపోవు నా యనెడు భయమ్మున॥

వేగ నిరోధక మైన దైన యీ-
విధ మే మని క్షణ మాలోచించెను।
లాగెడు శక్తియు సాగుట గని తన
లాంగూలము నొక పరి ఝాడించెను॥

**మహాప్రవాళరగడ**

పైకిఁ జూచెఁ బ్రక్కలన్ని
పరిశీలించినను దృష్టి-

పథమునఁ బడ నట్టి దైన
ప్రశ్నార్థక మౌ మాయను।
గాకుత్స్థతిలకుని బంటు
గనడు, క్రింద జలధి గనెను
గ్రహము గహ్వారానన యా-
కర్షించుట దనఛాయను॥

దూకె గుభేల్మని జలమున
దుష్టరాక్షసీముఖ మను
తోరపు సర మందున నీ-
దుచు మీన మనఁ జరించెను।
బ్రాకటముగ ఖరనఖములఁ
బాపాత్మయుదరము చీల్చి
భరియింపగ రాని ప్రబల
బాధకు గురి గావించెను॥

కొట్టుకొనుచు మొత్తుకొనుచు
ఘోరముగను దన్నుకొనుచు
గుట్టవలె ధభేల్మనుచును
గూలెను వార్ధి జలంబుల।
నెట్టకేల కార్భటంబు
లెల్లను జాలించివేసి
యిమ్ముగ నా సింహిక త్యజి-
యించెను దన ప్రాణంబుల॥

# సాయంకాలవర్ణనము-సూర్యాస్తమయము

హరిణగతిరగడ

తిరిగి హనుమయు సాగె ముందుకుఁ
దీవ్రగతిఁ గొని త్రికూటాద్రికి।
సరసరగ గగనమున రవియును
జనుచు నుండెను బశ్చిమాద్రికి॥

బాటసారులు నలసి సొలసియు-
బసలు సేరుట కొఱకుఁ దఱలిరి।
సూటిగాఁ బను లన్ని నెరనే-
ర్చుకొని పాటక జనులు మఱలిరి॥

కుక్షి నిండగఁ బశువు లన్నియుఁ
గూటములుగాఁ దిరిగె నిండ్లకుఁ।
బక్షిగణములు నేరుకొని లెసి
బయలుదేరెను దమదు గూండ్లకు॥

మధురగతి రగడ

పక్షిమృగగణా - వాస్వార్థం బగు।
వృక్షఫలకుసును - విస్తారం బగు॥

దక్షిణకూలవు - దర్శనమును గొనె।
నక్షీణమతి బలాఢ్యుఁడు హరి, గనె॥

పరిఖావలయితఁ - బ్రాకారావృత।
నరిభీకర వీ - రాసుర రక్షితఁ॥

బురి లంక నసుర - పురము వ్యవస్థిత।
నరు దైన త్రికూ - టాద్రి సుసంస్థిత ॥

విజయభద్రరగడ

కోటలను నా కోట - కొమ్ములను నందందుఁ
గోట కాపరుల నతి - ధాటి గల వారలను।
గోటానకోటులను - మేటి యోధుల నిలను
సాటి లే నటువంటి - సాయుధు లనేకులను॥

వనము లుపవనములను - వనరక్షకులను త్రిభు-
వనములను మించెడు భ - వనములను గపి గనెను।
వనజేక్షణలును యౌ - వనలు గీర్తింపగఁ బ-
వనతనయు డంత రా - వణకీర్తులను వినెను॥

విజయభద్రరగడ

చండశాసనుఁడు నుద్దండుండు రావణుడు
దండించి లోకాల - దహియించుచును గాల
దండప్రహరములకుఁ - దాళఁజాలక భీతి
దండి దగు కాలమున - దాగునో యను లీల॥

చండ భానుండు రవి - మండుటెండలు గాచి
మండించి జగములను - మాడ్చి యాకాశమున।
దండధారి యెవండొ - తరుము చున్నాడొ యనఁ
గొండ చాటుకుఁ జేరెఁ - గొంచెపు ప్రకాశమున॥

హరిగతిరగడ

ఇండ్లను వాకిండ్లను శుద్ధొనరిచి-
యింపుగ ముగ్గులు రచియించిరి విరి
బోండ్లు ముఖంబులు శుభ్రపరుచుకొని-
బొట్లను గాటుకలను సరిదిద్దిరి॥

